# విషయ సూచిక

01. పోతన భాగవతం - నవవిధభక్తులు ........................................ 1-9
- డా|| శ్రీష్టి లక్ష్మీభవానీ శంకర శర్మ

02. అన్నమయ్య సంకీర్తనలు - సంగీతం ................................ 10-16
డా|| తుమ్మల శ్రీనివాసులు

03. బంజారాల అశ్రిత కులాల సంస్కృతి ................................ 17-24
-డా|| ఎ. సిల్మా నాయక్

04. భారతీయ సంస్కృతిలో స్త్రీ - మనో విశ్లేషణ ........................ 25-28
- బోడ రజని

05. "సీమ భారతం"లోని మండలిక - మధురిమలు ...................... 29-32
- చిలక అనిత

06. డా|| నాగెళ్ళ ఏలియా అద్భుత సృష్టి గణిత అష్టావధానం ............ 33-43
- డా|| కప్పగంతుల మధుసూదన్

07. తెలుగులో ఇతిహాస సాహిత్యం - వ్యక్తిత్వ వికాసం .................... 44-46
- జె.వి. సుధీర్ కుమార్

08. చిల్లర దేవుళ్ళు నవల్లో తెలంగాణ సామాజిక జీవితం ................ 47-52
- డా|| ఎ. సిల్మా నాయక్

09. రోమన్ క్యాథలిక్ ఆరాధనలో కీర్తన వాఙ్మయం ...................... 53-58
- వి. పూర్ణచంద్రశేఖరరావు

10. "ఏకవీర నవలలో చిత్రితమైన మానసిక, సాంఘిక, రాజకీయ
మత పరిస్థితులు మనోవైజ్ఞానికత పాత్ర పోషణము .................. 59-63
- పల్లి చిన్నారావు

11. సంఘ సంస్కర్త - రాజారాయ్ మోహనరాయ్ ........................ 64-66
- డా|| ఎం. వసంతరావు, కె. శ్రీదేవి

12. స్త్రీవాద సాహిత్యం - బాధ్యతలు........................................ 67-71
- డా|| సి. హెచ్. విజయ కుమార్

13. మన సంస్కృతి .................................................. 72-75
- కె. హేమబాంధవి

ISBN No. 978-93-83729-93-7

# రోమన్ క్యాథలిక్ ఆరాధనలో కీర్తన వాఙ్మయం

## (పునీతుల పండుగలు మరియు ఇతర సందర్భాల్లో పాడే గీతాలు)

వి. పూర్ణచంద్రశేఖర్‌రావు
పరిశోధక విద్యార్థి, తెలుగు విభాగం,
శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయము, తిరుపతి.

పునీతుడు అంటే పవిత్రుడు అనే అర్థం క్యాథలిక్ సంస్థలో వాడుక. ఈ కోవలో యేసు శిష్యులు, హతసాక్ష్యాలు, తొలితరం నాటి మఠకన్యలు, క్రైస్తవం కోసం ప్రాణాలర్పించిన విశ్వాసులు తదితరులు పునీతులుగా పేర్కొంటారు. ప్రస్తుత తరంలో మదర్‌థెరిస్సా కూడా ఈ కోవలోకే వస్తారు.

పునీతులుగా గణించడానికి రోమన్ క్యాథలిక్ చర్చి కొన్ని నియమ నిబంధనలు ఏర్పాటు చేసిన అనంతరం వారిని పునీతులుగా నిర్ధారిస్తారు.

తమ పవిత్ర జీవనవిధానం ద్వారా, అద్భుతశక్తులను కలిగి క్రైస్తవ విశ్వాసులందరికి, ఆదర్శమూర్తులైనటువంటి పునీతుల గాథలను మననం చేసుకుంటూ, వారిని అనుసరిస్తూ జీవితం ధన్యం చేసుకోవాలనేది క్రైస్తవ మతంలో ఆచారంగా వస్తుంది.

### 1. పునీత యోసేపు (జోజప్ప) గారి గీతం :

పల్లవి : "తిరుకుటుంబమును తీర్చిదిద్దిన
ధన్యజీవికి వందనము
తిరుసభను కాపాడెడు తండ్రీ
ఓ యోసేపు వందనము
వందనము వందనము వందనము" (కీర్తనం)

పునీత యోసేపు గారి పండుగను మార్చి-19న జరుపుకుంటారు. యోసేపు నీతిమంతుడు, వినయశీలి, మితభాషి అనే సుగుణాలను కలిగియున్నవాడు. ఇతడు యేసు ప్రభువు సాకుడు తండ్రిగా, మరియమ్మ భర్తగా దేవుని సహవాసంలో ఉండటానికి ఎన్నుకోబడినటువంటివాడు. పునీత యోసేపు అని నూతన నిబంధనము ద్వారా (మత్తయి 1:24) తెలుస్తుంది. దావీదు వంశములోనివాడు. వడ్రంగి పనిని

ISBN No. 978-93-83729-93-7

జనవరి-31, 1888వ సంవత్సరములో మృతి చెందారు. 1934వ సం॥లో పునీతునిగా ప్రకటింపబడ్డాడు.

అలాగే "నీ నామమున వెలసిన నిలయం
ప్రభువా ఎంతో రమణీయం ॥2॥

నీ ప్రేమలతో విరిసిన సమయం
ప్రభువా ఎంతో కమనీయం ॥2॥

అనేదే ఆలయ ప్రతిష్ఠోత్సవ గీతం చాలా ప్రసిద్ధమైనది. నూతన దేవాలయ మును ప్రతిష్ఠించునపుడు ఈ గీతమును పాడుతారు. ఈ క్షేత్రముపై దేవుని వరప్రసాదము క్రుమ్మరించడం, దేవుని దరిచేరిన వారందరికి సహాయమును దయ చేయమని ఈ ఆలయములో సమావేశమయ్యే విశ్వాసులందరి హృదయాలను, దివ్యవాక్కు శక్తితోను, దివ్య సంస్కారాల వరాలతోను బలపరచమని, నిత్యరక్షణను ప్రసాదించమని దైవసన్నిధానములో కలిసి నిత్యానంద భాగ్యమును అనుభవించేటట్లు దీవించమని పై పాటనుపాడతారు.

అలాగే "యేసు మా దేశము
దీవించి ప్రేమించి కాపాడుము
సుఖ క్షేమంబును ప్రజలకెల్లను అనుగ్రహింపుము యేసునాథా!"

అను కీర్తన దేశము కొరకు పాడునది. ఈ పాటను ప్రత్యేకముగా దేశ సంక్షేమము కొరకు ప్రార్థించినపుడు పాడుతారు. దేశనాయకులు విచక్షణా జ్ఞానము కలిగి, దేవుని చిత్తానుసారముగా దేశాన్ని పరిపాలించాలని, మానవులందరు ఏక కుటుంబముగా చేరి ప్రేమతో నిండిన హృదయాలలో పొరుగువారైన, సహోదరీ సహోదరుల మధ్య న్యాయము కొరకు కృషి చేసేటట్లు దీవించమని మరియు క్షామము వలన బాధపడు ప్రతివారియొడ ఇతరులకు ప్రగాఢ ప్రేమను కలిగించి వారి ఆకలి బాధను తీర్చి, శాయిశక్తుల ప్రయాసపడేటట్లు, రైతులకు చాలినంత వర్షమునుతగిన కాలములో ఇవ్వమని వారు దవసధాన్యముల సహాయాన్ని సమృద్ధిగా పొందేటట్లు దీవించమని పాపాంధకారములో చిక్కుకుని బాధపడుతున్న వారందరిని దివ్య వాక్కు వెలుగుతో నింపమని ప్రార్థిస్తూ ఈ పాటను పాడతారు.

దైవారాధనలో ఎక్కడా దేవునికి మేలుకొలుపు కాని, పవళింపు కాని, క్రైస్తవంలో ఉండవు. కాని దేవునికి నిత్యము కృతజ్ఞతాస్తుతి చెల్లించడం ఉంది. ప్రతి ప్రార్థనలోనూ

ISBN No. 978-93-83729-93-7

చేసాయి. శౌరి ఎంతోమంది రోగులకు సహాయం చేశాడు. సమస్యాత్మకంగా మారిన గోవాక్రైస్తవులకు, మత విశ్వాసమును విలువలను, యువకులకు ప్రత్యేక బోధన చేశారు. ఆయన వారి వెంట వెళ్తూ చిన్న గంట పట్టుకొని మ్రోగించుకుంటూ వెళ్ళేవాడు. పిల్లలు, వారి తల్లులు, ఈ శబ్దం విని ఆయన చుట్టూ పోగయ్యేవారు. ఆయన వారందరినీ గుడిలోనికి తీసుకెళ్ళి ఓపికతో ప్రేమతో, ఉత్సాహంతో క్రైస్తవ విశ్వాసాన్ని బోధించేవారు. ఆయన బోధనలో ఎన్నో అద్భుతాలు జరిగాయి. దీని కారణంగా 40 సం॥లలో జపాన్‌లోని క్రైస్తవ జనాభా 4 లక్షలకు చేరుకుంది. చైనా నాగరికతను చూసి సువార్త ప్రబోధం చేయాలని ఆశించి వారికోసం 3 నెలలు సాన్సియన్ ద్వీపములో ఒక చిన్న గుడిశలో గుండెరోగానికి గురై డిశంబరు 2, 1552లో తీవ్ర జ్వరంతో అక్కడే మరణించాడు. 1553వ సంవత్సరంలో ఆయన శరీరాన్ని గోవాకు తీసుకొని వచ్చారు. ఇప్పటికి చెక్కుచెదరకుండా ఆయన భౌతిక శరీరం గోవాలో ఉంది. 1662వ సంవత్సరంలో 15వ గ్రెగరీ పోప్‌గారు వీరిని పునీతులుగా ప్రకటించారు. భారతదేశంలో సువార్త ప్రచారానికి ఆయన పాలక పునీతులు.

## 6. పునీత డాన్‌బోస్కో గారి గీతం :

పల్లవి : "యువకుల తండ్రి బోస్కో స్వామి - 2
ఏమని పాడెద నీ శుభనామం - యువతకు నవతకు నీవే మార్గము-2
నిరతము నీ పదమందే పయనము - నిరతము నీ పథమందే మా పయనము
మా ప్రియ బోస్కో స్వామి - మా ప్రియ బోస్కో స్వామి ॥యువకుల॥

పునీత డాన్‌బాస్కో గారి పండుగను జనవరి 31న కొనియాడుతారు. ఈ పునీతుడు ఉత్తర ఇటలీలో ఉన్న ఒక పల్లెటూరిలో పేద కుటుంబంలో 1815వ సం॥లో జన్మించారు. ఇతడు మరియమాత భక్తుడు. అతనిలో ప్రేమ, వినయం చూచి మరియమాత, క్రీస్తు ప్రభువు పునీత బోస్కో గారికి దర్శనమైనారు. దాని వల్ల ఎక్కువగా ప్రేరేపింపబడి చెడిపోయే కుర్రవాళ్ళను బాగుచేయుటకు ప్రయత్నించేవాడు. చిన్న చిన్న కథల ద్వారా, ఆటల పాటల ద్వారా చేసే గారడి వలన వినోదయాత్రల వలన ఇంకా అనేక రీతుల్లో చిన్న పిల్లలను బాగా ఆకట్టుకునేవాడు. ఇతను గురువుగా అభిషేకం పొందిన తరువాత యువత కోసం ఎంతో సమయం వెచ్చించేవాడు. వీరు ఎక్కువగా యువత కోసం, అనాథ పిల్లల అభివృద్ధి కోసం తోడ్పడతారు. ఈయన

ISBN No. 978-93-83729-93-7

## 4. పునీత అంతోని వారి గీతం :

పల్లవి : కావవే అంతోని - కరుణావన విభావా
దేవపర విఖ్యాతి - భావా

అనుపల్లవి : పావన హృదయాన ధ్వంధురాశ్రిత దక్ష
దేవమాతృకసక్త - ద్విప్రమానస పక్షి

పునీత పాదువాపురి ఆంతోని గారి పండుగను జూన్-13న కొనియాడుతారు. ఇతడు గురువుగా, మతసాక్షిగా, వేదపండితుడుగా సేవలందించారు. పోర్చుగల్ దేశంలోని లెస్బన్‌లో జన్మించారు. ఇతను పునీత అగు స్త్రీను వారివలె జీవించటానికి ఆదర్శంగా ఎన్నుకున్నారు. దేవుడు ఇతనికి అద్భుతాలను చేసే శక్తిని, అనేక భాషలను మాట్లాడే శక్తిని జరగబోయే విషయాలను తెలియజెప్పే శక్తిని ప్రసాదించారు. పరిశుద్ధ గ్రంథము (బైబిలు)ను వినయ విధేయతలతోను, అందరికి అర్థమయ్యే రీతిలో వివరించేవాడు. అతని స్వరము ఇతరులను ఎంతో ఆకట్టుకొనేది. ఇతని బోధనలను విన్న ఎంతోమంది తమ జీవితాలను మార్చుకున్నారు. అలాంటి గొప్ప పునీతుడైన పాదువాపురి అంతోని వారు 1231వ సం॥లో జూన్ 13వ తేదీన తన 36సం॥ల వయస్సులోనే పరమపదించారు. ప్రయాణం చేసేవారు, గర్భందాల్చిన స్త్రీలు, ఓడలో ప్రయాణం చేస్తూ ప్రమాదంలో ఉన్నవారు ఈ పునీతుని పేరును ప్రత్యేకంగా స్మరించుకుంటారు.

## 5. పునీత శౌరి వారి గీతం :

పల్లవి : "శౌరి వారిని సేవింతుము - కోరిక మీర

అనుపల్లవి : ధరణిలో భక్తుల దరిజేర్చుమని
పరిపరి విధముల బ్రస్తుతిజేసి" (కీర్తన)

పునీత శౌరి గారి పండుగను డిశంబరు-3వ తేదీన జరుపుకుంటారు. అతను మతసాక్షిగా, గురువుగా సేవలందించారు. ఆయన స్పెయిన్ దేశమందు 1506వ సం॥లో జన్మించారు. తత్త్వశాస్త్రములో పట్టభద్రుడు కావాలని 1528వ సం॥లో పారిస్ యూనివర్సిటీలోని పునీత బార్బారా కాలేజిలో చేరి అక్కడ పునీత లయోలా పురి సన్యాసి వారిని కలుసుకున్నారు. ఈ లోకాన్నంతటినీ జయించి నీ ఆత్మను కోల్పోయిన నీకు ప్రయోజనమేమి? అన్న సన్యాసి వారి మాటలే అతనిని యేసు సభ గురువుగా

చేసేవాడు. తాను చేసే పని పట్ల అంకిత భావం కలవాడు. క్రీ॥శ॥ 4వ శతాబ్దంలోనే యోసేపు గౌరవార్థం పండుగను చేశారు. క్రైస్తవులలో అతనిపట్ల భక్తి విశ్వాసాలు అద్భుతంగా పెరుగుతూ వచ్చాయి. క్రైస్తవ విశ్వాసులు కూడా జ్ఞానస్నానమును పొందినపుడు యేసేపు అని, జోసఫ్ అనే పేరును పెట్టుకుంటారు.

## 2. పునీత తోమా గారి గీతం :

పల్లవి : "ఆదరింపుమా నన్ను నర్చతోమయ్యా
ఆదరించి నన్నేలుమయ్యా" (కీర్తన)

పునీత తోమాసుగారి పండుగను జూలై -3వ తేదీన జరుపుతారు. ఈయన మొదటి శతాబ్దములోని వాడు. ఇతడు చేపలు పట్టే యేసు శిష్యులలో ఒకడు. సాధారణ నివాసి. యేసుపట్ల తనకు గల ప్రేమను బహిరంగముగా తెలియజేసినవాడు. విశ్వాసం కలవాడు. ధైర్యవంతుడు. యేసును గురించి తెలయచేయడానికి అవసరమైతే ప్రాణాలను కూడా అర్పించడానికి సిద్ధంగా ఉండేవాడు. క్రీస్తు ఉత్థాన విషయం గురించి మిగిలిన శిష్యులు తోమాసుకు తెలియజేసినపుడు ఆయన విశ్వసించలేదు. ఇలా జరిగిన వారం రోజులకు తర్వాత యేసు స్వయంగా కనిపించినపుడు, తోమాసు తన విశ్వాసమును తెలియజేశాడు.

## 3. పునీత తెరేజమ్మ గారి గీతం :

పల్లవి : "ఓ పావనీ తెరేజమ్మా - పరమాత్ముని
వేడమ్మా పావనీ" (కీర్తన)

పునీత తేరేసమ్మ గారి పండుగను అక్టోబరు - 1న జరుపుకుంటారు. ఈమె కన్యకగా జీవించింది. ఫ్రాన్స్ దేశంలో లూయిస్, జూలి దంపతులకు 1873వ సం॥లో జన్మించింది. కుటుంబంలో ఈమె తొమ్మిదవ సంతానం. చాలా అందంగా ఉంటుంది. చాలా తెలివైనది. ఎప్పుడూ దైవభక్తిలో మునిగిపోయేది. చిన్న వయస్సులోనే కార్మెల్ సభలో చేరి మఠకన్యగా జీవించాలనే ఆశ ఉండేది. కాని 21 సం॥ల వయస్సు వచ్చిన తరువాతనే సభలో చేర్చుకోవటానికి అంగీకరించారు. అయితే తన 15 యేండ్ల వయసులో తండ్రితో రోము వెళ్ళే అవకాశము దొరికినపుడు నాటి 13వ సింహరాయలు పోపుగారిని కలుసుకొని, కార్మెలు సభలో చేరటానికి అనుమతి కోరింది. ఆమె పట్టుదలను చూసిన పోపు గారు అనుమతి ఇచ్చారు.

ISBN No. 978-81-929374-6-5

వారికి చెబుతాడు. మీరిద్దరూ విడివిడిగా ఈ శిధిలాల్లోంచి బయటపడలేరు కాబట్టి, కలసి మీ శక్తినంతా ఉపయోగించి ఆ శకలాన్ని తొలగించమని చెపుతాడు. అల్లాబక్ష్, రఘురాం ఇద్దరూ కలసి ఆ శకలాల్ని పక్కకి తొలగించి బయటపడతారు. హిందువులూ, ముస్లింములూ ఈ దేశంలో ఉండిపోవటానికి నిశ్చయించుకున్నప్పుడు అనుక్షణం కలహించుకోవటం కంటే సర్దుబాటు చేసుకుంటూ, చిన్న చిన్న విషయాలలో ఇచ్చిపుచ్చుకుంటూ సహజీవనం సాగించమని తీర్పునిస్తాడు. ఇది లౌకిక విలువలకు నిలువుటద్దము.

## ఉపసంహారం :

తెలుగు సాహిత్యంలో ఇలాంటి ఎన్నో నాటకాలు లౌకికతను ప్రదర్శిస్తున్నాయి. ఆనాటి సమాజంలో హిందూ-ముస్లింల మధ్య వివాదాలను ఆధారంగా చేసుకొని వారి మధ్య సఖ్యతను, సహకారాలను కలిగించే విధంగా రచయితలు ఇలాంటి రచనలు చేశారు. వీటిని లౌకికవాదానికి చక్కని ప్రతిబింబాలుగా చెప్పవచ్చు.

